శ్రీరస్తు.

# ఏకప్రాససీతారామశతకము.

ఇది

అల్లమరాజు రామకృష్ణకవి

ప్రణీతము.




పండితులచే పరిష్కరింపఁబడి

శ్రీజగ్గమ్మకోటలో వెంచేసియున్న శ్రీసీతారామస్వామివారి

ఆలయము ధర్మకర్తలగు

మోగంటి కొండ్రాజుగారి ద్రవ్యసహాయమున

మొదటికూర్పు ౧౦౦.

కాకినాడ:

శ్రీసరస్వతీముద్రాక్షరశాలయందు చాకి చినసూర్యారావుచే

ముద్రింపఁబడి

మోగంటి కొండ్రాజుగారిచే ప్రకటింపఁబడినది.

1913.

వెల 4 అణాలు.

శ్రీరస్తు.

శుభమస్తు. అవిఘ్నమస్తు

## పీఠిక

శా. శ్రీమాహైమవతీసరస్వతులఁ గూర్మిం బెన్నురంబందునన్
సామేనన్ రసనాగ్రభాగమున నిచ్చల్ దాల్చి ముల్లోకముల్
ప్రేమన్బ్రోచుపురాణపూరుషులు పేర్మింగాతురశ్రాంతమున్
శ్రీమోగంటికులామృతాబ్ధిశశియౌ శ్రీకొండరాజాఖ్యునిన్.

## శ్రీజగ్గమపేట పురాభివర్ణనము

ఉత్పలమాలిక.—
శ్రీవసుధాపురంధ్రికిని సిబ్బెపుఁజన్నులలం జెలంగు హా
రావలులోయనంగఁ గడురంజిలివాహిను లల్లియున్న గో
దావరిమండలంబున సతంబు పిఠాపుర రాజవర్య రా
జ్యావని లోనఁజేరి మునుపారయరాఘవరాజసీమ పృ
థ్వీవర పాలితంబునయి దీపితసత్యహరిప్రభావ శో
భావహమైన రత్నగిరి కంతికమై ఘనబాపనేంద్రు నా
ఖ్యావనసత్తటాకమున కాకరమైదనరారుచుండె ల
క్ష్మీవిభవాభిరామరుచి గేహసమృద్ధిఁ జనాభివృద్ధి యి
చ్ఛావరసిద్ధిపేటియగు జగ్గమపేట పురీవరంబొగిన్.

తే. గీ. ఆపురంబునఁగాపురం బేర్పమీఱు
చాపురంబున కిఁకసల్వైదిదుహగ్గె

లకును సద్గుణకత్వ విలాసగరిమ
గాంచిరార్వేలవారు మోగంటివారు.

—•••◆శ్రీసీతారాములఁ బ్రతిష్ఠాశ తద్దేవస్థల ధర్మకర్తల యునగు మోగంటి కొండరాజు వంశాభి వర్ణనము.

సీ. సకలభూభృద్వర సామ్రాజ్యధూర్వహలీలా
పరిణము లార్వేలవారు
రాజ్యాంగమంత్రి తంత్రవిభాస్వరక్రియా
పాలనదక్షు లార్వేలవారు
పరరాజ్య భేదనోపాయాదిసుగుణగం
భీరాంబుధీశు లార్వేలవారు
సామదానవిభేద చండదండవిధాన
వేద్యప్రతాపు లార్వేలవారు
తే. గీ. విపుల విద్యావివేకు లార్వేలవారు
విశద సత్కీర్తివంతు లార్వేలవారు
అట్టియార్వేల సచ్ఛాఖ యందుఁబుట్టి
నారుమోగంటివారు చెన్నారినారు.

సీ. బ్రాహ్మణోపాధి పత్రముల సృష్టికీసప్త
వంటివారిలను మోగంటివారు
పితృవాక్యపాలన ప్రీతిఁజూపఁగరాము
వంటివారిలను మోగంటివారు
సత్యవాక్యప్రతిజ్ఞకు శ్రీహరిశ్చంద్రు
వంటివారిలను మోగంటివారు

# శ్రీసీతారామశతకము.

సాధుసజ్జనులను సస్యంబులకు మేఘు
లంటివారలను మోగంటివారు

తే. గీ. వరలు వితరణమునఁగర్ణు వంటివారు
నగుచు జగదేక విఖ్యాతి నందినట్టి
కాశ్యపాన్వయ జనులు మోగంటివారు
తన్నియోగిమహాన్వయాంతరమునందు.

చ. తిరుపతిరాజుపుట్టెఁగవి దీనజనావలిఁ గాంచిప్రోవశ్రీ
తిరుపతిరాజెయౌతఁడన ధీవరసన్నుతుఁడౌచుఁ దారని
ర్జరఝర కల్ప భూరుహ విశారదశారద నారదేందు ధి
క్కరణ యశోవిశాలుఁ డరికాలుఁడుసద్గుణ శీలుఁడౌనసఁ.

ఉ. ఆసచివాగ్రిగణ్యున కహఃపతి తేజుఁ డుదారసాహసో
ల్లాసగుణోత్తరుండు శుభలక్షణలక్షితదివ్యమూర్తి సం
భాసురుఁడైమహిం జెలఁగ మల్లపరాజు జనించిపైత్రస్యమై
భాసిలు గ్రామణిత్వము ప్రభన్నెరవేరిచె నిష్కళంకుఁడై.

ఉ. ఆయసమానమూర్తిగనె నాఁటవవెల్లి సుధాంశునట్లు స
దాప్తియనభాస్కరుఁ సచివరాజయుగంధరుధిక్కరించుమే
ధాయుతు సాధురక్షణ విధానపరుఁ నృపమాన్యునిఁ సరో
జాయతనేత్రునిం దిరుపతాఖ్యు సుధీజన ముఖ్యపూజితుఁ

సీ. కలియుగమక్షి షట్కమలజయుగసంఖ్య
వతిఁల్లుదుర్మతి వత్సరమున

నెలఁగొక్క ఫుష్నమ నెలతొలిపక్కంపు
పదునాలుగవతిథి గదియుసోమ
వాసరమున భానుస్వర్భానులును జాప
మున వృషభంబున వనజవైరి
వివరింప సింహాది వృశ్చికాంతముదాక
శనిగురు కుజబుధుల్ సరవినిల్చి
యుండంగశిఖి కవుల్యుగ్ర నక్రములొంద
సరవికన్యాలగ్న సౌమ్యభమున

తే. గీ. సచ్ఛుభగ్రహ షడ్వర్గ సమయమందు
ఘనగుణకదంబ సీతాంబ గర్భమందు
దివ్యమైనట్టి తిరుపతితేజు బలిమి
రమ్యగుణరాశిఁ గొండలరాజుఁగనియె.

తే. గీ. అవలఁదిర్పతిరాజు సీతాంబవలనఁ
గనెను మల్లపరాజును ఘనునిబుణ్య
తముని శమముఖ సుగుణ సత్త్వముని నగ్రి
జన్మచరణాబ్జ సేవనా చరణరతుని.

కొండ్రాజామాత్యునిజీవితము.

ఉ. ఆయుగళంబులోనసుజనావనుడగ్రజుఁడాదిపిత్రియం
బైయలరారుసద్గణకతాధికృతింబ్రజమెచ్చఁజేయుచున్
బ్రాయమునంబ్రయాగమథురాగయబృందలయోధ్యకాశిఁ
త్యాయతభక్తినేగివిమలాత్ముఁడునైయిలుఁజేరిపిమ్మటన్.

చంపకమాల పంచపాది.

కులమును దాఁ బవిత్రమగు కోరికతోఁ ఘనతీర్థయాత్రలం
త్యలఘుమనస్కుడై చనియు నందుల దృష్టినిఁ జెందకింక లో
కులుఁగని మెచ్చ సర్వశుభకోటులు హెచ్చ రమాహృదీశు దే
వళమును సంఘటించి పరివారముతోఁ డఁ బ్రతిష్ఠ సేయఁగా
దలఁపుఁ జనింప నంతశుభదంబగు వాసరమెంచి మోదినై.

వ॥ అట్లు పారావారానంద కందళిత హృదయారవిందుండై ర
వీందులోచన ప్రతిష్ఠార్థస్థలంబు నెమకుటకుఁ దొడఁగొని
విషమ చతురశ్రమ త్రిశూలత్రికోణాకారంబుగాక సమచ
తురశ్రమంబై నిమ్నోన్నతంబుగాక సమున్నతంబై మ
హాపవిత్రంబై మనోహరంబునై స్వగృహోపాంతంబునైన
స్వస్వాస్థ్యప్రదేశంబునఁ బ్రాకారంబుఁ గట్టించి తదరంత
రంబునఁ దన్మనోద్దిష్ట దైవతంబుల కనువుగ శిల్పిశాస్త్రవి
ధ్యుక్త ప్రకారంబున నతిరమణీయంబుగ దేవాలయంబు
లు నిర్మింపఁజేసి సుందరతరేంద్రనీల శిలావిగ్రహంబులా
యత్తపఱచి వర్తమానకలియుగ వర్షంబులు బుతుగగ
నద్వయ శరసంఖ్యాకంబును శాలివాహన శకాబ్దంబులు
మునికరవసుశశి సంఖ్యాకంబును హూణశకశరంబులు భూ
తాభ్రాబ్జవిధి సంఖ్యాకంబును వర్తిల్లు శ్రీమద్విశ్వావసు
నామ వత్సరోత్తరాయణ వసంతర్తు మాధవమాస శుక్లప
క్షదశమీ భానువాసర మధ్యాన్నకాలంబునఁ బునర్వసూ
నక్షత్ర కటకలగ్నంబగు శుభగ్రహస్థిత శుభదృగ్యోగం

బునందు ఋత్విగ్గురువిప్రదు లాజ్యాది హోమంబులాచరింప మంత్రశాస్త్రజ్ఞులు జపంబులు సలుప విద్వత్కవి గాయక వైతాళిక నర్తకవందిమాగధ బృందంబు తత్తద్వైదుషీ గరిమలచేఁ మీఱుచుంబొగడ వేశ్యాంగనలాడ బ్రాహ్మణ్య తేజోధనులాశీర్వదింపఁ బంధుమిత్ర పరివారంబు పరివేష్టింప మంగళతూర్య నాదంబులు చెలంగ నాగమవిధ్యుక్త ప్రకారంబున సకలలోకకర్తయు భర్తయు హర్తయు నేతయు భోక్తయు సర్వాంతర్యామియు నగు నాదివిరాణ్మూర్తిని నావాహనంబొనర్చి త్రిజగన్మోహన శిల్పి రచితాంచిత శిలావిగ్రహంబుఁ బ్రతిష్ఠించి యమ్మహానీయు ననంతనామంబులలోఁ బండితపామర జనానీక సౌలభ్యంబుగ మహాపాతకోపపాతక దారుణ గహన దహన దావానలంబగు శ్రీమద్రామ నామకరణంబుఁ జేయించి తత్సహచరియును మహామాయయు నగు నాదిమశక్తిని శ్రీసీతాభిధానంబుచేఁ బ్రతిష్ఠించి శృంగారలీలా వినోదార్థమై శ్రీరాధాకృష్ణాహ్వయ దైవతంబులంగూడఁ స్థాపించి వారిపంచాయతనాధిష్ఠిత దైవతంబులగు పవనాత్మజార్కగణరాజాన్నపూర్ణావిశ్వేశ్వరనందీశ్వర సిద్ధివినాయకాది సప్తకంబును బ్రాగాగ్నేయ యమనైఋతివాయవ్యోత్తరేశానక కుప్పులఁ దత్తత్పరివారంబులతోఁ బ్రతిష్ఠించి తదధిష్ఠానాధి దైవతంబులకు నర్చన పుష్పోపహార ధూపదీపనైవేద్య ధ్యానవందన దాస్యాదులర్పించు

చు నిత్యోత్సవ వారోత్సవ పక్షోత్సవ మాసోత్సవ ఋతూత్సవాయనోత్సవ వర్షోత్సవాది భోగరాగార్థ వ్యయంబులకుందగు గుమ్మరేగుల వేళంగి జగ్గమపేట యను గ్రామత్రయంబునఁ దనస్వాస్థ్యంబులలో నఱువది తొమ్మిది యకరముల యేబదారు శెంట్ల మాసంబై ప్రతివర్షంబును శతత్రయరూప్యంబులాదాయంబు రాగల మాన్యక్షేత్రంబులు సమర్పణంబుఁగావించి ప్రియానుజతనూజ మాతాద్రి కుటుంబపరివారుండై తద్దేవారాధన సందర్శన సుఖంబులఁ బ్రొద్దుపుచ్చుచు నేఁటేట నీ శ్రీరామనవమీ పుణ్యవాసరంబునఁ దత్సీతారాములకుఁ గల్యాణమహోత్సవంబు మహావైభవంబునఁ జేయించుచుఁ దత్కరుణామృత వీక్షణ ప్రసారంబున నత్యంతసంపద్విభూతులఁ దులఁదూఁగుచు ముక్తికన్యాకరగ్రహణాయత్త చిత్తుండై యల్లారుముద్దుఁ దమ్మునికిఁగలఁ గొఱంతఁ గుఱుతెఱిగి తనయునుఁగుఁ గొమరు గంగరాజాహ్వయుఁ బుత్రదానంబొసఁగి తమ్మునిం దత్సహ ధర్మిణియగు సీతమాంబనుఁ గృతార్థులఁగావించి యనుజతనూజాది కుటుంబభారంబు స్వప్రతిష్ఠితేష్ట దైవంబునకర్పించి తదారాధన దాస్యాదులుఁ దనపుత్రునిపై బెట్టి దక్షిణంపు దివ్యస్థల సందర్శన కుతూహలుండై శ్రీరమోమారుంధతీ సమానేకకల్యాణ పాతివ్రత్యాది సుగుణగణ సమేతయగు సీతారామసతీరత్నోపేతుండై మాతృదేవతా పురస్కృతుండై యొకశుభముహూర్తమున ని

లు వెడలి భద్రాచల శ్రీరంగ కంచి కాళహస్తి కుంభకో
ణ రామేశ్వర శ్రీశైలాది దివ్యక్షేత్రంబుల మెట్టియు సం
దర్శించియు నాయాపుణ్య తీర్థములఁ గ్రుంకులిడియు త
త్తత్ స్థలాధిష్ఠిత దైవతంబుల సేవించియు సఫలమనోరథుం
డై కతిపయదివసంబులకు స్వస్థానమలంకరించి స్వస్థాన
మలంకరించిన జగదధీశ్వరునే సదాధ్యానించుచు శ్రీయః
పతిమైక్యానుసంధానంబే గోరుచు తద్దేవస్థాన ధర్మకర్తృ
త్వంబు నిర్వహించి కాలంబు గడుపుచున్న యొక్కనాఁడు.

## శతకరచనా కారణము

చ. హారీతసగోత్రసంభవుఁడ సన్నమరాజకులాబ్ధిసోముఁడ
న్మఱియును రామకృష్ణకవి మాన్యుని పౌత్రుఁడ రామచంద్రధీ
వరునితనూజుఁడన్ సుకవి వంద్యుఁడఁ గృష్ణవిలాసకావ్యమున్
సిరిమగనింగృతీంద్రునిగఁ జేసిరచించిన రామకృష్ణుఁడన్.

మ. అగునేనచ్చటికేగి శ్రీహరిపదధ్యానైకపారీణు సా
రగుణోపేతు జగత్పవిత్రకృతిఁ గొండ్రాజున్ మహాభక్తియు
క్తిగనాతండు ప్రతిష్ఠఁ జేసిన రమాధీశాది దైవంబులన్
సొగసౌనాలయచిత్రముల్గనుచు సంస్తోత్రంబుఁ గావించియున్.

క. ఆ దేవారాధనములు
నా దేవాలయవిధంబు లా కైంకర్యం
బా దాస్యమ్ములుఁ గనఁగడు
మోదంబై పరవశత్వమును గావింపన్.

# శ్రీసీతారామశతకము.

క. వ్రతతీర్థయాత్రలుతప
శ్శతశతములు శౌరినామ సంస్మరణబలం
బు తులకుఁ రావనుచున్నే
నతనికిఁగృతిగాఁగశతక మర్పణఁజేయన్.

తే. గీ. తలఁచియున్నంతఁ గోవెలధర్మకర్త
దానికినుమడిఁగా దోహదంబుసేయ
శతకమొకవ్రాసిన తోడనిశ్శంకఁగూర్చి
తద్రమేశున కర్పింపఁ దవిలెబుద్ధి.

తే. గీ. కలియుగాబ్దమ్ములగుమను గగనభూత
సంఖ్యబరగు ప్రమాది వత్సరమునందు
సరవినాషాఢ శుక్లపక్షమున దశమి
రవిదినంబున శతకము వ్రాయఁబూని.

ఆ. వె. మూఁడుదినములకును బూర్తిగావించి
నాఁడె రాముఁగూర్చినాఁడనిందు
బొందుపఱచినాఁడ బుధులుఁ బఠింపుచో
దప్పులున్నదిద్ది మెప్పఁగనుఁడి.

ఇట్లు విన్నవించు విధేయుఁడు,
అల్లమరాజ రామకృష్ణకవి.



శ్రీ రస్తు.

శుభమస్తు. అవిఘ్నమస్తు.

# ఏకప్రాస శ్రీ సీతారామశతకము.

—●●◆ మదిష్టదైవతంబగు శ్రీ సీతారామస్తుతి. ◆●●—

శా. శ్రీమన్మంగళ దేవతాహృదయరాజీవార్కు-మాసేంద్ర సు
 త్రామాబ్జాతజశంకరప్రముఖగీర్వాణార్చితాంఘ్రిద్వయుఁ
 శ్యామాంగుంజలజేక్షణుంగుణనిధింస్వర్ణాంబరుంజిన్మయుఁ
 రామున్సర్వజనాభిరాముమదిలోఁ బ్రార్థింతుసశ్రాంతముఁ.

—●●◆ ఏకప్రాస శ్రీ సీతారామశతక ప్రారంభము. ◆●●—

—కందములు—

శ్రీజనకతనూజాహృ
 ద్రాజీవవిరాజమాన ♦ రాజీవాప్తా
 రాజద్రూపపరాత్పర
 శ్రీజగ్గమపేటధామ ♦ సీతారామా॥.

శ్రీజగదభిరామసుధీ
 రాజవినుతభవ్యనామ ♦ రవికులసోమా
 తేజస్సీమ రఘూత్తమ। శ్రీజగ్గమపేట.

రాజిలు మోగంట్యన్వయ
 భాజనుఁడా కొండరాజు ♦ భక్తిని నిన్నుం
 దేజానఁ బ్రతిష్ఠఁ జేసిన। శ్రీజగ్గమ.

రాజగజానను విఘ్నన
మాజహరున్నతకపూర్తిఁ ♦ మన్ననఁజేయఁ
బూజింతు భక్తియుక్తిని। శ్రీజగ్గమ.

శ్రీజలజ భవునిరాణిని
రాజత్పద యుగళిఁగొలుతు ♦ రసనవసింపఁ
బూజితపదరాజీవా । శ్రీజగ్గమ.

నేజోహారు లొసంగెద
నాజనకుమదీయగురుని ♦ నలినాంఘ్రులకుఁ
తేజోబలముల నొసఁగఁగ । శ్రీజగ్గమ.

ఓజగ హరిగిరిజాగణ
రాజార్క స్థాపనంబు ♦ రహిఁజేసియె కోం
డ్రాజుప్రతిష్ఠించెను నిను । శ్రీజగ్గమ.

ఓజగదాధారా ఖగ
రాజతురంగాభుజంగ ♦ రాట్తల్పక సు
శ్రీజలధికన్యకావర । శ్రీజగ్గమ.

ఈజగముఁబుట్టఁబెరుగం
గాఁజెఱుపనజాచ్యుతాంబి ♦ కాపతివౌనీ
రేజాక్షసంస్మరించెద । శ్రీజగ్గమ

రాజధరాజరరాజను
రాజసురక్షిందద్రిమారు ♦ తాత్మజ ముఖ సం
పూజితచరణాబ్జద్వయ । శ్రీజగ్గమ.

రాజశరాబ్జసుపర్వో
ర్వీజమహాజలధిరాజ ♦ విష్ణుపదీ స
త్తేజోజిత విశదయశా । శ్రీజగ్గమ.

రాజాబ్జాప్తాంబకనగ
రాజతనూజాంతరంగ ♦ రాజీవనివా
సాజగతీ పావనకర । శ్రీజగ్గమ.

ఓజీవన దాతవిభో
*యోజీవన దాశ్వవినుత ♦ యురుభుక్తిదయో
§యాజిప్రియ తనయహరీ । శ్రీజగ్గమ.

శ్రీజానిదివ్యముని సం
పూజితపదపద్మయుగళ ♦ పూతచరిత రా
మా జగదభినుతనామా । శ్రీజగ్గమ.

తేజోధనసంపన్నవి
రాజభరద్వాజ భృగుప ♦ రాశరముఖ హృ
ద్రాజీవనిలయ ప్రముక్తిద । శ్రీజగ్గమ.

ప్రాజదువుల గనికొలమున
కాజగములమేటివగుచు ♦ నలరెడిదైత్యాం
భోజవనీమత్తేభమ । శ్రీజగ్గమ.

---

* జీవనదాశ్వ=ఇంద్రుఁడు.

§ అజి=అజమహారాజు కుమారుఁడగు దశరథుఁడు.

రాజు మొదలు కీటాంతం
*ఆజీవుల మనువు చెలువు ♦ నఖిలాధిప య
వ్యాజపదంబొనగూర్పుము । శ్రీజగ్గమ.

¶జాజుగల నీపదంబులు
జాజులఁ జేమంతిపూల ♦ సంపెంగలసం
భోజములఁ బూజించెద । శ్రీజగ్గమ.

ఓజస్కాముఁడు పరధన
రాజింగని యోర్వకున్న ♦ రహిఁ జెడఁడేరా
రాజువలెఁ రఘురామా । శ్రీజగ్గమ.

ఓ జలజనాభ సతతము
నేజోహారొసఁగుచుంటి ♦ నెనరుంచియు స
ద్రాజ ద్వారములోసంగవె । శ్రీజగ్గమ.

శ్రీజలజాంబక చెలువున
శ్రీజలజాంబకుఁడవీవె ♦ శ్రిత జనమందా
రాజగతీసమ్మోహన । శ్రీజగ్గమ.

ఓ జలజాంబక జనకమ
హాజస్కాయా శ్రితాన ♦ నోదయరక్షో
రాజిహారణకరుణాకర । శ్రీజగ్గమ.

---

*ఆజీవములు=ఉపాధులు.

¶జాజా=కావిరంగు.

ఓజంగమస్థిరాత్మక
యోజాంబవదంబుజాప్త ♦ జోత్తమనుత నే
జేజేయనివినుతించెద। శ్రీజగ్గమ.

భూజాభోగాన్వితయం
భోజారిగదాసుశార్ఙ్గ ♦ భూషితకరగం
గాజనక నన్నుబ్రోవుము। శ్రీజగ్గమ.

ఆజానువ్యాప్తసుబా
హా జలధిశయాన సజ్జ ♦ నావనచణ వి
భ్రాజద్విభూతినొసఁగుము। శ్రీజగ్గమ.

రాజా దశరథరాజత
నూజా రవికోటితేజ ♦ నుతగిరిజేశా
నాజనకనన్నుఁబ్రోవవర। శ్రీజగ్గమ.

శ్రీజాంబూనదచేలము
రాజిలు విద్యుద్విధముగ ♦ రంజిల్లఘనం
బౌ జీమూతంబనఁదగు। శ్రీజగ్గమ.

నాజనని సీతనీవే
నాజనకుఁడవనుచునమ్మి ♦ నమ్మితిదయతో
భ్రాజద్విభూతినొసఁగుము। శ్రీజగ్గమ.

ఆజిన్ బరభీకరుఁడవు
రాజద్వరదుఁడవు సుజన ♦ రాజికినీస
ఖ్యాజిష్ణుత్వము నెంచెద। శ్రీజగ్గమ.

# శ్రీసీతారామశతకము.

రాజద్రూపసహస్రమ
నోజారవితేజభక్త ♦ నుతసురభూజా
రాజీవాయతలోచన । శ్రీజగ్గమ.

ఈజీవప్రతిమలమా
యాజవనికమీఁదనుంచి ♦ యాడించువినో
దీజీవన దాముక్తిద । శ్రీజగ్గమ.

పాఱిజదువులు దొంగిలివే
వేఁజనిఁగడలిఁడాగు ♦ వెఱ్ఱినిఁదిమ్మివై
యాజముని పోఱిలికనిపిన । శ్రీజగ్గమ.

ఓజాంబూనదచేలా
యోజగతీపాలరామ ♦ యుత్తమశీలా
యోజలనిధిగంభీరా । శ్రీజగ్గమ.

రాజులనిరువదియొకమా.
ఆజినిఖండించుపరశు ♦ హస్తునిదీనుం
గాఁజేసిన మహిమాఢ్యా । శ్రీజగ్గమ.

నేజష్టుఁడఁ దామసుండను
కాజనుడఁనునీదుభక్తి ♦ కాసంతయులే
దోజనక యెటులబ్రోచెదో । శ్రీజగ్గమ.

నీజనకునాసఁ గౌశికు
తోఁజనిజన్నంబుఁగాచి ♦ ధూర్జటిఘనువుల్
బోఁజెఱచి సీతఁగొంటివి । శ్రీజగ్గమ.

రాజీవాప్తతనూజున
కాజినిజయమొసగి వాన ♦ రావలి కెల్లన్
రాజనఁబట్టముఁ గట్టిన । శ్రీజగ్గమ.

జేజేలు రావణాదుల
చేఁజిక్కులకోర్వలేక ♦ సేవించిన నెం
తేఁజంపితివా దైత్యుల । శ్రీజగ్గమ.

ఓజన్నామాయనఁగా
నేజమునై నను విడుంత ♦ మేలింతువనీ
రాజన్నామమహాత్మున । శ్రీజగ్గమ.

ఓజన్వోఁడిచిమరాయని
తాజపియించెన్ ద్వదాఖ్య ♦ తత్ఫలముననే
సీజననకథకుఁడాయెను । శ్రీజగ్గమ.

కాజనులసంగతంబును
ధీ జన దేవాగ్రిజస్మృ ♦ ధిక్కారంబెం
తోజరపుదు రితమెడలుపు । శ్రీజగ్గమ.

భూజలసమీరపుష్కర
తేజములను పంచభూత ♦ దీపితమౌనం
బౌజగదంతర్యామీ । శ్రీజగ్గమ.

బీజమునదుమమునా ప్ర
ద్వీజము నంబీజమట్లు ♦ విశ్వమునీలో
నాజగతిలోనసీవును । శ్రీజగ్గమ.

# శ్రీసీతారామశతకము.

తాఁజేయుకర్మతతి ఫల
మోజం దనుఁగట్టి కుడుపు • నుగ్రనయిన నిం
కేజీవుఁడుఁ జనఁగలఁడో । శ్రీజగ్గమ.

నీజిగి మేని నిగన్నిగ
లాజీవనదంబుమీఱు • నలనాభిగనం
గాజీవనదమునదుమును । శ్రీజగ్గమ.

నీజగజంపుహారాయలోమ్మ
మాజాబిల్లినిహసించు • నతీమణీనగవుల్
రాజకళల నోడించును । శ్రీజగ్గమ.

శ్రీజిగిగుబ్బల కనువై
నీజపితాభీష్టసిద్ధి • నెఱినిడననువై
తేజరిలు త్వత్కరంబులు । శ్రీజగ్గమ.

ప్రాఁజదువుల పెట్టియయుడు
రాజునహోరాత్రములను • రాజిలుటలునీ
తేజమునగాదె శ్రీవర । శ్రీజగ్గమ.

ఆజిన్రావణదనుజు త
నూజ తనూజాత్మజాద్య • నూనకులంబున్
వేజముని పాలికనిపిన । శ్రీజగ్గమ.

ఆజనపదమునబంగరు
రాజింకను వంకనేగి • రహిమారీచున్
యోజనమునఁబడఁ గూల్చిన । శ్రీజగ్గమ.

నైజముభక్తులఁ బ్రోచుట
నైజముదుష్టులను నేచ ♦ నలినాక్షునకం
చీజగతిబిరుదునూనిన । శ్రీజగ్గమ.

భూజాతను జెరఁగొనులం
కాజగతీశ్వరునిభ్రాత ♦ కరుణింపుమనం
గాజంకుఁదీర్చికాచిన । శ్రీజగ్గమ.

శ్రీజలచరకులిశాబ్జస
రోజాదిశుభాంకములని ♦ రూఢంబగు నీ
రాజీవాంఘ్రులగొలిచెద । శ్రీజగ్గమ.

ఈజగములఁబదునాలుగు
నీజఠరాంతరమునందు ♦ నిలిపియునీవా
యాజగములఁ జరియింతువు । శ్రీజగ్గమ.

శ్రీజనకజహస్తములకు
భాజనములుముక్తినొసఁగు ♦ భాగీరథికిన్
బీజములునీపదంబులు । శ్రీగ్గమ.

రాజితశైలవిహారబి
డౌజఃపరమేష్ఠులకును ♦ నురుతారకమా
యాజలధిదాటఁదరమా । శ్రీజగ్గమ.

ఈజగతితేమరవిగొని
దాజలమిడినట్లపాప ♦ తతినణచినుఖం
బోజముభక్తులకిడెదవు । శ్రీజగ్గమ.

## శ్రీసీతారామశతకము.

జేజే పెద్దనసంగా
జేజేపెద్దనుశివుండుఁ ♦ జెల్లినశివుని
ట్లోజనెలకొల్పుచుంటివి । శ్రీజగ్గమ.

గాజుంబూసల సుమణుల
తోజతయనిమెచ్చునట్లు ♦ దుర్జనులనుసీ
రాజద్భక్తులఁబోల్చుట । శ్రీజగ్గమ.

ఆజాహ్నవీప్రభృతినదు
లాజలనిధిఁగలియునట్టు ♦ లబ్జభవాంశం
బోజన్నిలోఁగలియును । శ్రీజగ్గమ.

రాజమహో రాజమహో
తేజస్క-కిరీటరత్న ♦ దీధితులసదా
రాజిలుభవత్పదంబులు । శ్రీజగ్గమ.

భూజానవతారుణ్యాం
భోజవనీరాజహంస ♦ పురుషోత్తంసా
కాజనహింసామోదా । శ్రీజగ్గమ.

తాఁజవిఁజూచినపండ్లన
భాజినిశబరియొసగంగ ♦ భక్షించియున
వ్యాజపదంబానఁగూర్చిన । శ్రీజగ్గమ.

స్త్రీజననిందితశూర్పణ
ఖాజారనురూపుమాపి ♦ ఖరముఖరక్షో
రాజినిఁగూల్చినమేటివి । శ్రీజగ్గమ.

రాజయ రాఘవరామా
రాజితకామా రమేశ ♦ రాశాశౌరీ
రాజద్వారములోసంగగ । శ్రీజగ్గమ.

భూజాతచనులు గంటులు
గాఁజేసియుఁగాకిపోఁక ♦ కరుణింపుమనం
గాజీవమొసఁగి ప్రోచిన ♦ శ్రీజగ్గమ.

ఆజానేయమునెక్కి స
తీజనములసేనఁ బ్రోలు ♦ దివ్యసుమములు
ట్లాజధరించిచరించెదు । శ్రీజగ్గమ.

*ఆజియునసీవిలోకన
పూజాస్మరణానులాప ♦ ములుజరపనిదు
ర్భాజనులునరకగాములు । శ్రీజగ్గమ.

శ్రీజలచరకమఠకిటి
వ్యాజనృసింహాభిధాన ♦ వామనభృగురా
మాజనుతాద్యవతరణా । శ్రీజగ్గమ.

శ్రీజీమూతాభాంగా
¶శ్రీజీమూతేశధారి ♦ శీతలహృదయా
‡వాజీశ్వరాధిరోహా । శ్రీజగ్గమ.

* ఆజియునను=యుద్ధకాలమందయినను
¶ జీమూతేశ=పర్వతశ్రేష్ఠము,
‡ వాజి=పక్షి.

# శ్రీసీతారామశతకము.

శ్రీజనకసుతాకైకే
యీజసుమిత్రాకుమారు ♦ లింపుగఁగొలువన్
రాజిల్లితినీఁగొలువా । శ్రీజగ్గమ.

వాజిమదేభోర్వీవసు
రాజినొసఁగుదాతలెల్ల ♦ రంజిల్లెడినీ
రాజద్భక్తులఁబోలరు । శ్రీజగ్గమ.

భాజనులనభాజనులని
కాజనులనుబూజ్యులనుచు ♦ గలినెంచెదరు
ర్వ్యాజనులదేమిచిత్రము । శ్రీజగ్గమ.

రోజుభుజంగంబులవలె
కాజనులైజూదమాడి ♦ కలుద్రావిపర
స్త్రీజనవశులైరికలిన్ । శ్రీజగ్గమ.

ఫాజీలనురాజులుగా
రాజులఫాజీలయట్ల ♦ రహిఁజేయుదువా
యాజీవికర్మమట్టుల । శ్రీజగ్గమ.

నాజీవమునకుజీవము
నాజనికింబావనంబు ♦ నాయెడకిమహా
రాజత్తారకనామా । శ్రీజగ్గమ.

*ఏజతనముఫలియింపదు
నీజతసరిపడకయున్న ♦ నిఖిలాధిపన

* ఏజతనము=ఎట్టిప్రయత్నము.

న్నే జంట గూర్చిబ్రోచెదో । శ్రీజగ్గమ.

* నీజవుకుఁబలుకులెన్నో
యోజన్ జవి గోల్పిలుకర్ణ ♦ యుగళము కటువో
కాజనులమాటలానున । శ్రీజగ్గమ.

జేజేయనుమారుతి సుర
రాజాశాయతనుఁడౌచు ♦ రహినుండగఁ గాం
ద్రాజుప్రతిష్ఠించెనునిను । శ్రీజగ్గమ.

రాజత్కాంతి నొసంగెడు
రాజీవాప్తుననలాశ ♦ రంజిలనిలిపెన్
గాజననుతుడు రమాధవ । శ్రీజగ్గమ.

ఆజము దిక్కుననిలిపెను
రాజద్గణనాధువిఘ్న ♦ రాజిహరింపన్
భూజనముల పూజలుగొన । శ్రీజగ్గమ.

ఆజగదంబను ముకుళిత
రాజత్కరయుగళితనర ♦ రహినిరృతిదిశన్
దేజరిల నిలిపెభక్తుఁడు । శ్రీజగ్గమ.

ఓజన్ దమ్ములు గొలువగ
భూజాతోపేతుఁజేసి ♦ భువిపశ్చిమది
గ్రాజత్పీఠినిమిమ్మిడె । శ్రీజగ్గమ.

---

*నీజవుకుపలుకులు=నీమనోహరమగుమాటలు.

# శ్రీసీతారామశతకము.

రాజకళాధరునాగణ
రాజఁగొలువమూరుతాళ ♦ రహినిలువంగొం
డ్రాజుప్రతిష్ఠించెనునిను । శ్రీజగ్గమ.

రాజధరుతేజినినుద
గ్భ్రాజద్దేవాలయమునఁ ♦ బరగఁగ శ్రీకొం
డ్రాజుప్రతిష్ఠించెనునిను । శ్రీజగ్గమ.

ఏజనులుముందుముందుగఁ
బూజించినపూజఁగొనుచు ♦ మూషకవాహుం
డాజనకుదెసనునిలిచెను । శ్రీజగ్గమ.

ఓజగ్గ దేవళములకొం
డ్రాజప్రతిష్ఠించెనిటుల ♦ రఘుతిలకామీ
రాజత్పంచాయతనము । శ్రీజగ్గమ.

ఆజగ్గమపేటనెయిటు
లోజన్వేంచేసియున్న ♦ యుత్తమపరివా
రాజనకజామనోహరఁ । శ్రీజగ్గమ.

రాజిలుకొండ్రాజాదిని
యేజాంబూనదములిడెనో ♦ యిపుడామహిమన్
మీజపదర్శనములఁగొనె । శ్రీజగ్గమ.

ఓజజగన్నాథముకా
శీజలనిధిబంధనమ్ము ♦ సేవించెనుకొం
డ్రాజుభవద్భక్తుఁడుసుమి । శ్రీజగ్గమ.

నీజగదేకపవిత్రవి
రాజలసన్నామపఠన ♦ రక్తి నొసఁగఁగాం
ద్రాజును బాలింపవలెన్ ♦ శ్రీజగ్గమ.

ఏజేజేలనునమ్మఁడు
నీజలజాంఘ్రిద్వయంబు ♦ నెఱివీడఁడుగాం
ద్రాజు భవద్భక్తుఁడనుమి । శ్రీజగ్గమ.

పూజనములమంగళనీ
రాజనములవందనములు ♦ ప్రార్థనములఁగాం
ద్రాజు నినుఁగొలిచెఁబోవుము । శ్రీజగ్గమ.

పూజించుచుండెననిశము
దాఁజదువుచునుండె నీప ♦ దములు కథలు గాం
ద్రాజత నినెటుబఁబోతువో । శ్రీజగ్గమ.

తాజాయాపుత్రాదిస
మాజములోనుండిచారి ♦ మమతనువిడిగాం
ద్రాజు నినునమ్మియుండెర । శ్రీజగ్గమ.

మీజన్మవాసరమునన్
త్మ్రాజాతనుమిమ్ముఁగూర్చి ♦ కల్యాణముగాం
ద్రాజేచేయుచునుండెర । శ్రీజగ్గమ.

తేజీలందలములుగో
రాజియు వెండియును బైఁడి ♦ ధాములనిడిగాం
ద్రాజున్ దయతో నేలుము । శ్రీజగ్గమ.

## శ్రీసీతారామశతకము.

రాజిలుకొండ్రాజసుతుఁ
దేజోనిధిఁగీర్తిమూర్తిఁ ♦ దిరుపతిరాజుఁ
తేజోబలమిడిబ్రోవుము । శ్రీజగ్గమ.

ఈజగముననఖిలార్థము
లాజగముననీపదంబు ♦ లర్థించితి నీ
రాజోహారులొసంగితి । శ్రీజగ్గమ.

నీజగదేకపవిత్రవి
రాజచ్ఛతకంబుతార ♦ రాజార్కముగా
నీజగతిమనఁగఁజేయవె । శ్రీజగ్గమ.

రాజీవజకులుఁడల్లమ
రాజశ్రీరామకృష్ణ ♦ రాట్కవి శతకం
బోజరచించియొసఁగెఁగొను । శ్రీజగ్గమ.

నాజన్మసఫలమందం
గాఁజేయవె యుడుతభక్తిఁ ♦ గనిమెచ్చుగతిన్
భాసిజచ్ఛతకముఁగృతిఁగొని
శ్రీజగ్గమపేటధామ ♦ సీతారామా.

కం. శ్రీజానికిమంగళము ధ
రాజానికిమంగళంబు ♦ రహిభక్తుఁడు కొం
డ్రాజునకుమంగళమ్ములు
శ్రీజగ్గమపేటధామ ♦ సీతారామా.

—శ్రీజగ్గమపేట శ్రీసీతారామశతకం సంపూర్ణం.—

శ్రీహనుమత్సీతాలక్ష్మణ
భరతశత్రుఘ్న పరి
వారసమేత
శ్రీరామచం
ద్రార్పణ
ము.



పంచపాది.

ఉ. కంటివినేరచించుశత ♦ కంబును నందలికందపద్యముల్
వింటివి నాదుభక్తికిని ♦ వేడుకనొందుచు ధర్మకర్మమో
గంటికులాబ్ధిసోముఁడును ♦ గాదిలిభక్తుఁడు కొండరాజు తాఁ
బంటవలంతిసేలువలు ♦ బంగరుఁరూకలునింకఁగాన్కలె
న్నింటినొసాఁగొసంగునటు♦తేలుచునుంటివి శ్రీమనోహరా.

చంపకమాల.

కృతిపతిసుప్రసిద్ధుఁడును ♦ కేవలభక్తుఁడుధర్మకర్మపు
ణ్యతముఁడుకొండరాజలద ♦ యానిధిశ్రీపతియాజ్ఞనూనిము
ద్రితమొనరింపఁజేసి ప్రచు ♦ రించెనుబావనమైనదీని ; శా
శ్వతమయిసద్యశంబునిలు♦వఁగధరపైమనుగాతమూతఁడున్.

## అష్టకములు.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

శ్లో. శ్రీమంతం కీర్తిమంతం శ్రితనివహావనీసద్వసంతంవసంతం
జగ్గంపేటాభిధాన ప్రవిలసితమహా గ్రామమధ్యే ప్రశాంతం
దాంతంరక్షః కృతాంతం భువనమురుకృపావీక్షణైఃపాలయంతం
సీతాకాంతంభజేహం మమహృదిసతతం జన్మశుద్ధ్యైనితాంతం.

తనోతుభద్రాణిమహానుభావం
పరఃపరస్మాజ్జగదేకపూజ్యః
మహీసుతామానసపద్మభానుః
కృపాంబురాశీరఘురామచంద్రః.

యస్యాతిరమ్యవదనాంచితమందహాస
జ్యోత్స్నాప్రకాశయతిభూమితనూభవాయాః
నేత్రోత్పలద్వయమనంతగుణంతమాద్యం
రామంభజేమనసి జగ్గమపేటసంస్థం.

యస్యాంబుజోపమితపాదపరాగలేశః
పాషాణరూపకలితాత్మపదాంగనాయాః
శాపాద్విముక్తిమకరోత్తముదారభావం
రామంభజేమనసి జగ్గమపేటసంస్థం.

యన్నామసంస్మరణమాశ్రితపాతకాని
దూరీకరోతి దివివాయురివాభ్రబృందం

వందారుకామితసుపర్వమహారుహాంతం
రామంభజేమనసి జగ్గమపేటసంస్థం.

వాల్మీకినారచయితుంమహానీయకావ్య
రూపేణయస్యచరితంపరమార్థమాసీత్
సుత్రామముఖ్యదివిషత్పరిపూజ్యమానం
రామంభజేమనసిజగ్గమపేటసంస్థం.

అజ్ఞానినోపిమనుజాసవతుప్రసాదాత్
సంప్రాప్నువంతిపరమంపదమూర్ధ్వలోకే
తస్మాత్త్వదీయమహిమాబ్జభువాభినంద్య
సీతామనోహరణజగ్గమపేటవాసిన్.

ధనుర్మహేశస్యవిభజ్యసీతా
వివాహసౌభాగ్యముపైతియస్యః
రఘూత్తమోరావణదైత్యహర్తా
సదావతాజ్జగ్గమపేటవాసీ.

మోగంటివంశశశినావరకొండరాజ
నామ్నాప్రతిష్ఠితముదారగుణైస్సమేతం
శృంగారభూషణవిభూషితగాత్రయష్టిం
రామంభజేమనసి జగ్గమపేటసంస్థం.
చేబ్రోల్పురీనివస దల్లమరాజసోమ
నామ్నాకవిత్వని పుణేనకవీశ్వరేణ

విస్తారభక్తిరచితం నవరత్నసంజ్ఞం
స్తోత్రంగృహాణకృపయాఫణిరాజశాయిన్.

క. శ్రీమజ్జగ్గమపేట, గ్రామలలామైకధామ ♦ కామితఫలదా
నామరభూరుహకానన, సీమాసుగుణాభిరామ♦సీతారామా.

క. అనుపమితభక్తితోడను,
బనిఁగొనిశుభకార్యములకు ♦ బహువిధములనె
వ్వనిబూజింతురతనిమా,
న్యునివిఘ్నేశ్వరునిగొలుతు ♦ నూర్జితమతినై.

శ్లో. రాజీవసంభవముఖామరసేవ్యమానౌ
తారాగణోపమనఖద్యుతిభాసమానౌ
ప్రత్యగ్రపల్లవసమారుణకాంతియుక్తౌ
శ్రీరామచంద్రచరణౌశరణంప్రపద్యే.

మ. జలరాశిన్ వడిదాఁటిలంకనుబ్రవే ♦ శంబందిశీతాంగనా
విలసద్రూపముఁజూడఁగోరితుదకే ♦ న్వేషించితద్రూపమున్
బొలుపొందంగనిరాముతోనుడివిసం♦పూర్ణప్రమోదంబునన్
లలితుండైతగునాంజనేయునిఘనున్♦శ్లాఘింతునిష్టంబునన్.

సీ. అనసమానబలశాలి ♦ యగు నాంజనేయుండు
తూరుపుదెసయందు ♦ దొడరియుండ
నరవినమస్కృతుల్♦సంఘటించెడివారిఁ
గనుచుదివాకరుఁ♦డనలుదిక్కు

నందుజెన్నొందఁగయామ్య♦దిశాస్థలి
విఘూధినాథుండు వెలయుచుండ
నైఋతిదిశనింక ♦ నాకేశసన్నుత
యన్నపూర్ణాదేవి ♦ యలరుచుండ
రాధికాకృష్ణధ ♦ రాసుతారాములు
పశ్చిమదిశయందుఁ ♦ బరఁగుచుండ
వాయవ్యదిశయందుఁ♦గాయజారాతివి
శ్వేశ్వరుఁడుదయాత్ముఁ ♦ డెనగుచుండ
వరుసనుత్తరదిశనంది ♦ వరలినిలువ
భవదిశాస్థలమునగణ♦పతివసింప
నాయవంబగునటులపం ♦ చాయతనము
దేవభవనాంపరస్థమై ♦ తేజరిల్లె.

సీ. ఇనవంశవర్ధనుం♦డిష్టఫలప్రదుం
డగుదశరథపార్థి ♦ వాత్మజుండు
భక్తజనశరీర ♦ బాధాపహారియా
ఘనతరతేజస్వి ♦ కమలసఖుడు
పరమపాతివ్రత్య♦భాసమానసుశీల
యగునట్టియన్నపూ ♦ ర్ణాంబికయును
ద్వైమాతురుఁడువిఘ్న ♦ ధారాధరానిలుఁ
డగునట్టిపార్వతీ ♦ యాత్మజుండు

సర్వలోకేశ్వరుండగు ♦ శంకరుండు
వీరలందఱునొకచోట♦విస్తరిలగ
మహితపంచాయతనమాయె♦మహిమగలిగి
గాంచె జగ్గమపేటలో♦గణుతిసేయ.

కవిరాజవిరాజతము.

హృదయమునందువిశేషపుభక్తివహించుచునెంతయురాఘవునిన్
ముదమునగొల్చుచుజగ్గమపేటను ♦ ముఖ్యముగానొకకోవెలని
ల్పిదనుజభేదినిరాఘవునందుల ♦ వేడ్కఁబ్రతిష్ఠఘటించుచుసం
మదమునొసంగెనుగొండలరాయుడు♦మాన్యగుణోన్నతుఁడెన్నని [లన్.

మత్తకోకిల.

పండితుల్ సకలావనీసుర♦పాళియున్ సరసోత్తమో
ద్దండవాక్కులుగల్గిచూడగ♦దగ్గివచ్చినవారికిన్
దండిమోద మొసంగునీసభ♦తద్దయున్ వినుతింపఁగన్
బండితచ్ఛటకేతగున్ మఱి♦పామరచ్ఛటకెట్లగున్.

దత్తాక్షరీపద్యపూర్తి.

శ్లో. పద్మబాంధవసంకాశం సంశ్రీకరమహాంఘ్రిభం
దేవవర్గైశ్చసంపూజ్యం వందేరామంశుభప్రదం.

మందాక్రాంతావృత్తం.

శ్రీనప్తారంతిరుపతిసతస్సప్తసంతానకీర్త్తి
ర్మల్లాఖ్యాస్యప్రభునియమితగ్రామజేస్సత్యపాత్రం

ఇత్యాధ్యస్యప్రియతిరుపతేర్ధ్యానశీలస్యపుత్రం
కొండ్రాయంస్వమతచరితంరక్షతాచ్చక్రపాణిః.
మోగంటివంశభవమామ్నాయమార్గచరమామాత్యవంశతిలక
శ్రీకొండలాఖ్యపరమానందరామభవనాస్థాననిర్మితధియం
జగ్గమ్మనామగణ పత్నీప్రకామవసి తాత్మేశభక్తిభరితం
త్వాంపాతునీలరుచిరామస్సదాపివిదితాద్వైతతత్త్వవిభవం.

సీ. శ్రీకరుండురుకరుణా♦కరుండరిజన
భీకరుండవిభావి♦భాకరుండ
అక్షరుండువినమ్ర ♦ రక్షణుండనురేంద్ర
శిక్షణుండుపయోరు ♦ హేక్షణుండు
సుందరుండంఁడజ ♦ స్యందనుండమితపు
రందరుండు సుధృత ♦ మందరుండు
భీషణుండతిమృదు♦భాషణుండుదురాత్మ
దూషణుండుస్వభృత్య♦పోషణుండు
బాలసుకళాధరసమాన♦ఫాలతిలుడు
నైనవేలుపుప్రోచుత♦నవనిమిమ్ము
వైళముగనిక మోగంటి♦వంశదీప
మహితగుణధుర్య♦కొండరాణ్మంత్రివర్య.

మ. సరసీజాక్షి మనంబునన్ దలఁపనా♦శ్చర్యంబుసంధిల్లెడిన్
బుర రాజంబయిపొల్చుద్వారవతిలో♦భూరిప్రభావంబుతో

వరుడాకృష్ణుడుగోపకాంతలపయిం♦బద్మాంబక క్రీడలం
దెరువుల్ రంజిలుచున్న వేళలనహా♦నేరీతినెట్లుండునో.

కవిరాజవిరాజితం.

వనరుహాబంధుడుగ్ర్రుంకజగంబున♦బరువడిజీకటులెల్లవడిన్
ఘనరుచిచేతనుదూరమొనర్చుచు♦గన్నులకెంతయునింపుదగన్
బనివడివెల్గగనంబడజేయుచు♦భక్తజనంబులుసంతసిలన్
గనునిటకోవెలయందు గులోబధి♦కంబగుమోదమొసంగెసదా.

మత్తకోకిల.

వైరికోటికసాధ్యమైతగు ♦ బాహుపుర్గుభుజంబునన్
మీరుచుండపదంబులందున ♦ మేలగున్ హరిదంశుకం
బారయంగనువక్షమందున ♦ హారముల్ జెలువొంది శ
రీరమంతయుగప్పిచక్కని♦రీతిస్వామికిదోచెడున్.

సత్యవోలు సోమసుందరకవి విరచితము.

సీ. గొప్పవారలచేత ♦మెప్పుగాంచుచునున్న
భవ్యతరోన్నత♦త్వంబుతోడ
ధీరాత్ములెంచిను♦తించుచుండెడులీల
నలరారుచుండుధై ♦ ర్యంబుతోడ
రాజమాన్యతగాంచి♦రహిమీఱుచుండుపరి
సిద్ధమానట్టిసు♦స్థిరతచేత
బీదసాదులనెంచి♦పెంచజాలినమంచి
లలితకృపారస ♦ లహరిచేత

గీ. గుణమణులచేత మోగంటి ♦ కులజుఁడైన
ఘనతరుండగు కొండ్రాజు ♦ తనరుచుండె
కొండలకురాజుగానుండు ♦ కుధరమట్లు
సుకవివినుతనిజాఖ్య సా ♦ ర్థకముగాఁగ.

క. రాముఁడు హిమగిరిజానుత
నాముఁడు త్రైలోక్యవినుత ♦ నవ్యయశః శ్రీ
కాముఁడు జనకతనూజా
ధాముఁడు సిరులిచ్చి ప్రోచుఁ ♦ దద్ధన్యాత్ముల్.

—••◆•అల్లమరాజు సోమకవిగారిచే ప్రతిసంవత్సరము కళ్యాణ
సదస్యసభలో చేయబడు అష్టావధానపద్యములు•◆••—

స్రగ్విణి. సారసారాతికిన్ ♦ శైత్యభావంబొగిన్
దోఁషమానట్లుగన్ ♦ దోఁచుసన్మార్గ వి
స్తారచిత్తంబునన్ ♦ శాంతమొప్పన్నెనే
ధీరతన్ గ్రాలెడున్ ♦ డెల్పనో నెప్పుడున్.

సుగంధి. మంచిజెప్ప నేనికర్ణ ♦ మార్గమందునుంబ్రవే
శించకుండునల్పబుద్ధిఁ ♦ జేరిదుష్టమానఫల్
మించి పాకంబుసేయు ♦ మేకొనంగనౌనెయీ
గాంచునట్టి కాలరీతి ♦ కష్టమయ్యెడిన్ గలిన్.

చంపకమాల.
పరులకుమంచినేర్పమెయి ♦ భావుకధర్మములెన్నియేనియున్
సరసతమీఱబోధనలు ♦ సల్పుచుగీర్తికిహేతుభూతుఁడై

ధరదనరారుసజ్జనుఁడు ♦ దారుఁడు ధీరుఁడు నీతిసత్కళా
భరణము వానినేరికిని ♦ వర్ణనసేయనశక్యమెంతయున్.

స్రగ్ధర ఏవారేలీలభక్తిన్ ♦ హితమతిసతతం
బెంతయుం బ్రార్థనంబుల్
గావింపన్వారి వేగన్ ♦ గరుణ వెలయఁగన్
గాచునద్దైవతంబిం
పావేల్పుం దేవపూజ్యున్ ♦ హరిముఖవినుతున్
హారకేయూరధారిన్
సేవింతున్ రామచంద్రున్ ♦ శ్రితజనశుభదున్
స్నిగ్ధమూర్తిం బ్రమోదున్.

భుజంగప్రయాతము.

ప్రభావంబునన్ వేచి ♦ భక్తిప్రపత్తిన్
శుభంబొప్ప నానంద ♦ శుద్ధిన్ సతంబున్
గభీరాపగన్ జేయఁ ♦ గాంగ్లుషుల్యంబు
బభీష్టంబులన్ సిద్ధి ♦ నందింపధాత్రిన్.

